# శ్రీరాముఁడు

రామచంద్రుండు దశరథ ♦ రాజ తనయుఁ
డై యయోధ్యాపురంబున ♦ నవతరించెఁ;
గడపె పితరులతోఁ దన బాల్య ♦ కాల మెల్ల
కాల మంతయు గడియలై ♦ గడచిపోయె
కాని, కాలంబు రాముని ♦ గాని, వాని
సుగుణచారిత్రములఁ గాని ♦ సుంతయేని
మఱవలేదు; మఱెన్నఁడు ♦ మఱవఁబోదు.
ఇదియె పరమార్థ మందఱి ♦ కిహమునందు
దేవుఁడే దేహధారియై ♦ దివిని విడిచి
భువికి దిగి రా నవసరంబు ♦ పుట్ట దెపుడు
ఎవరు బాల్యంబునుండి జి ♦ తేంద్రియు లయి
దేశసేవ యొనర్తురో ♦. దేవుఁ డట్టి
వారి హృద్వీధిలో నుండి ♦ పలుకుచుండు
మాట లేల తక్కిన వన్ని ♦ బూటకములు.
రాముఁ డాదర్శమూర్తి బా ♦ ల్యంబునుండి
తప్పు నాడఁ డెవ్వరి బెట్టి ♦ దములు పలుకఁ
డాడి తప్పఁడు కలనైన ♦ నన్నృత మన్న
మాట యెఱుఁగఁడు కాంతల ♦ మాట లెపుడు
ఉబుసునకునైన నెత్తఁడే ♦ మున్నఁగాని
మిగుల మొగమాటి, లజ్జావి ♦ మిశ్రితుండు
సఖులు సోదరు లని లేక ♦ సంచరించు
నముల ప్రేమాబ్ధి పొంగి పొ ♦ ర్లాడుచుండ
నిండు సంతోషమునఁ దూఁగు ♦ చుండు నెపుడు

నియమముల మీఱి చెడుగు రా ♦ నీయఁ డెదను
మదము, మాత్సర్య మనునవి ♦ మొదలె లేవు
సదయహృదయుండు బహు సాధు ♦ సజ్జనుండు
అతని సారూప్య మందటే ♦ కబ్బవలయు
అతని విజ్ఞాన మందటే ♦ కందవలయు
నతని నర్థించి యట్టి యో ♦ గ్యత గడించి
మాతృదేశంబు పూజించి ♦ మనుట లెస్స.
ఒక్కనాఁడు ప్రాతఃకాల ♦ ముదయశైల
శిఖర మరుణాకృతిని దాల్చి ♦ చెన్నుమీఱ
పక్షు లుదయగీతంబులు ♦ పాడుచుండ
కుసుమ పరిమళముల మోచి ♦ కొనుచు మంద
మందగతిఁ బిల్లవాయువు ♦ మాటి మాటి
కొడలు పులకితముగఁ జేసి ♦ వెడలుచుండ
అట్టి బ్రహ్మముహూర్తాన ♦ ఆ ప్రశాంత
సమయమందు విశ్వామిత్ర ♦ సంయమీంద్రుఁ
డరుగుదెంచె; కషాయ చే ♦ లాంచలములు
నలుదెసల ధగద్ధగితమై ♦ యలరుచుండ
కక్షపాలయు దండంబు ♦ నక్షమాల
కాంతు లీనఁగఁ దన తపో ♦ గర్వనిరతి
తెలిపె బ్రహ్మచర్యమునందు ♦ తేజ మపుడు.

... ... ... ...

అతని కెదురుగ దశరథుఁ ♦ డరుగుదెంచి
ఓదలను మ్రొక్కి పూజించి ♦ యతని రాక
కేమి కారణ మన మౌని ♦ యిట్టు లనియె
రామభద్రుని నా యజ్ఞ ♦ రక్షణార్థ

మడుగుచున్నా నొసంగు మ ♦ భ్యంతరంబు
లాడ కని యర్థియై వచ్చి ♦ యడిగి వాని
నెంటఁ గొనిపోయె దండక ♦ విపినమునకు
రామునకుఁ బదాఱేఁడుల ♦ ప్రాయమైనఁ
గౌశికునివంటి మౌనిశే ♦ ఖరుఁడుఁ గూడ
శిరము వంచి నమస్కృతి ♦ చేసినాఁడు
చేతులారంగ నతని బూ ♦ జించినాఁడు
తల్లిదండ్రుల మాటలు ♦ దప్పకుండ
సత్యము వచించువారిని ♦ సద్గుణాఢ్యు
లైన వారిని బ్రహ్మొదు ♦ లైనఁ గాని
గౌరవింపక పోవ రే ♦ కాలమైన
మొగలి రేకులు కురుచగా ♦ ముళ్లనున్న
సౌరభం బెల్లవారును ♦ సన్నుతింతు
రటులె జ్ఞానముచే వృద్ధు ♦ లైన వారి
నెల్లవారును బూజింతు ♦ రిందు నందు

... ... ... ...

కౌశికుండును, రాముండుఁ ♦ గానకేగు
దారిలో నడ్డుదూరి దు ♦ ర్వార ఘోర
రాక్షసాలయ సంచార ♦ దక్షఘోంటి
తాటకాసుర తీండ్రించి ♦ మాట లాడ
నొక్క వ్రేటునఁ దల రెండు ♦ ముక్కలగుచు
బ్రయ్యఁ జేసెను; గుణమును ♦ బట్టి రాముఁ
డరికులభయంకరుండు వీ ♦ రాధివీరుఁ;
డంతఁ గౌశికుఁ డెంతయో ♦ సంతసమునఁ
దోఁగి రామునిఁ గీర్తించి ♦ కౌఁగిలించి

క్రమ్మఱ ముని వసిష్ఠాశ్ర ♦ మమ్మునకును
నడచె నటఁ బర్వదిన మొండు ♦ గడపుటకును
నాఁడు తత్ప్రాంత తపసి జ ♦ నంబుగూడ
జూడవచ్చిరి; ఆ వసి ♦ ష్ఠుని కుటీర
మాదినము నిత్యకల్యాణ ♦ మై దనర్చె;
అందులో బ్రహ్మఋషులు మ ♦ హాత్ములైన
దేవఋషులు రాజఋషు లు ♦ దీర్ణ తేజు
లగుచుఁ గోలాహలంబున ♦ నలరుచుండి
రంతట వసిష్ఠ తాపసి ♦ యట్టె లేచి
వార లొసఁగెడు ఫలపుష్ప ♦ పత్రములను
రోసి శూన్యహస్తుఁ డయి జి ♦ జ్ఞాస నొక్క-
మూల నిలుచున్న శ్రీరామ ♦ మూర్తిఁ జేరి
అర్థిఁ బూజించి తెచ్చి య ♦ ర్ఘ్యాసనంబు
నొసఁగ నెల్ల రాశ్చర్యంబు ♦ నొంది దాని
హేతు వేమని యడిగి రా ♦ ఋషిని ఋషులు
శిష్టగుణగరిష్ఠుండు వ ♦ సిష్ఠుఁ డిట్టు
లనియె వినయము రేకెత్తు ♦ నట్టు లపుడు :
"ఓ మహామునులార! యీ ♦ రామచంద్రుఁ
డతి సుగుణసాంద్రుఁ డితఁడు బా ♦ ల్యంబునుండి
దుర్గుణంబుల నెదనుండి ♦ త్రోలినాఁడు
సొంతసొమ్మౌనె తృణముగాఁ ♦ జూచినాఁడు
ఒరుల కాత్మార్థములు ధార ♦ వోసినాఁడు
లోకకంటకయును, దైత్య ♦ లోకమునకుఁ
బంటయును నగు తాటకఁ ♦ బట్టి దాని
జీల్చి చెండాడి జగతికి ♦ క్షేమ మొసఁగి

శాశ్వతఫలంబు మనకును ♦ సకలజనుల
కొక్కసారి ప్రసాదించి ♦ యున్న యితని
దర్శనఫలంబుకన్న న్వ ♦ ధాఫలంబు
లెన్ని మీరిచ్చినను వేడ్క ♦ లెసఁగఁబోవు
ఇట్టి ఫలములె మన మపే ♦ క్షింపవలయుఁ
జెడ్డఫలములు మనము వ ♦ ర్జింపవలయు.
ఇతనికన్న మహాత్ముఁ డీ ♦ యిల నెవండు?
ఎన్నితపములఁ జేసిన ♦ నెన్ని జన్మ
ముల నొనర్చిన దన స్వార్థ ♦ మునకె గాని
అధిక మేమున్న దిఁక నీ మ ♦ హాయశుండు
స్వార్థము పరిత్యజించి లో ♦ కార్థ మాత్మ
దేహము సమర్పణముఁజేసి ♦ దేశ సేవ
సంఘసేవయు నీరీతి ♦ సలిపినాఁడు.
ఇతఁడు పూజ్యుండు గాక మ ♦ రేమి యగును!
ఎవ్వరు జితేంద్రియులు నయి ♦ యీశ్వరార్ప
ణంబుగాఁగఁ బరోపకా ♦ రం బొనర్తు
రట్టివారు బ్రాహ్మణులైన ♦ నెట్టి యన్య
జాతివారైనఁ గాని య ♦ శంబుఁ గాంచి
వసుధఁ బూజింపఁబడు టిది ♦ వాస్తవంబు."

# పల్లెటూరి కాపు

౧

ఎవ్వరో యీ దారి
ఈ కొండ ఈ లోయ
ఈ మారు మూలల్లో
ఈ పూరి కొంపల్లో
ఏగుచున్నారు. మ
మ్మడుగుచున్నారు.

౨

మా వూరు మా పేరు
మా దారి మా కోన
మా రైతు పల్లెల్లో
మా పేద పాపుల్లో
మార్పు లున్నాయ?
నిట్టూర్పు లుడిగాయ?

౩

మా చేలు మా గొడ్లు
మా చెర్వు కన్నాలు
మా చోట్లు మా పాట్లు
మా చిత్ర చిత్రాలు
చూచిపోతారా? మ
మ్మాంచి కొంటారా?

౪

ఈ కొర్వి కుంచెల్లు
ఈ మెఱుఁగు బుర్వల్లు

తొల్ కారు మెరుపుల్లు
తాటాకు మంటల్లు
మాకు దీపాలు. మా
నెలవంక రూపాలు.

౫

ఈ కొండ దేవతలు
ఈ కోయ కొంపలు
ఈ కటిక చీకట్లు
ఈ కట్ల మంచాలు
మాకు వ్రాసెనో? ఇవి
మాకు నచ్చెనో?

౬

వానల్ల తడిసేటి
కానల్లో మెలిగేటి
మా నల్ల రూపుల్లో
మా తెల్ల చూపుల్లో
మీకు చోటుందా?
చీకాకు పోయిందా?

౭

చేలంట తిరిగేటి
ఆలంట మసిలేటి
పాలికాపుల్లోను
కోలాన్ని మార్చేటి
కాలు చూచారా?
మా కోల గన్నారా?

౮

వెదురుగూసలను వంచి
పొదరిండ్లలో పొంచి
కదలేసి రాకాసి
కదుముల్లో కడ తేర్చి
నది మరచినారా?
మీ రడి గడచినారా?

౯

ఆ గాలి అటు వీచి
ఈ గాలి ఇటు వీచి
మా గొంగళ్ళుల మూతో
శ్రేగొట్టితే, మేము
సాగి పోలేమా? మే
మాగి పోతామా?

౧౦

ఆ పిడుగు లటురాలి
మా పిడుగు లటు దూలి
ఆ పాప కూపాలు
మా పట్టుపగ్గాలు
ఆపలే మంటారా? మే
మోపలే మంటారా?

౧౧

మా జోగి మాకలే
మాజాతి కాదులే

ఆ జారు కేజర్ల
లో జొచ్చి జయభేరి
గో జవంటారా ?
ఆ రోజు గంటారా ?

౧౨

కాలంబు మారితే
మూలంబు తెలిసితే
కోల కాలాహియూ
నేల పాతాళమూ
చాల నన్నవారె
పాలు కొంటారు. యీ

౧౩

చేలల్లో భాగాలు
పాలల్లో రాగాలు
నేలల్లో సౌధాలు
ఈలాగు మారితే ?
ఏ లేదంటారా ? మాతో
ఆల మంటారా ?

౧౪

పువ్వుల్లో ముళ్లుంటె,
నవ్వుల్లో విషముంటె,
తివ్వల్లో తేళ్లుంటె,

ఎవ్వాళ్లో తెలిసితే,
నెవ్వారంటారు ? ఇది
అట నెవ్వ రుంటారు ?

౧౫

సాగినన్నాళ్లు మీ
వేగు సాగిందన్న
సాగునా కలికాల
మీగిపోకుండ మా
బాగు రా దంటార ?
ఆలాగు కా దంటారా ?

౧౬

ఏలాగు చెప్పితే
ఆలాగు నడిచితే
ఆలీపా తలచితే
ఆ లేఖనే విష
జ్వాల చల్లార్చదా ?
కాలంబు మార్చదా ?

## కాఫీ

తే. ఆకటికి శంకరుండు నంగ ♦ లార్చి విషము
ద్రావనే గాని కాఫీని ♦ ద్రావలేదు
సింధు దాహార్తుఁడై యుగ ♦ స్త్యుఁడును జలధి
ద్రావనే గాని కాఫీని ♦ ద్రావలేదు.

తే. అమరు లమృతంబు ద్రావినా ♦ రప్పుడు; ఇప్పుడు
ద్రావుచున్నాము కాఫీని ♦ తేరుచు మనము
అది జరామరణంబుల ♦ నాపుచుండు
నిది జరామరణంబుల ♦ నిచ్చుచుండు.

తే. సురల కమృతంబుఁ బోసి యు ♦ సురల కెల్ల
కాఫి పోసెను మోహినీ ♦ కాంత యప్పుడు
అవని ఆ కాఫియే యిప్పు ♦ డవతరించి
మనలఁ బీడించుచున్నది ♦ దినదినంబు.

తే. మధువుకన్నను దియ్యనై ♦ మతిని దనుపు
సుధను మీరినదై చాల ♦ సొగసు గూర్చు
చక్కెరకు మించి యమృతంబు ♦ ధిక్కరించు
కాఫి కన్నను వేఱె భ ♦ క్ష్యంబు గలదె.

సీ. గురువు చెప్పినఁ గాని ♦ గుడికిఁ బోవనివాఁడు
కాఫీ దుకాణంబు ♦ కడకుఁ బోవు
పరదేశ విద్యని ♦ బడికిఁ బోవనివాఁడు
పెసరట్లకై పోయి ♦ పీకులాఁడు

కోటి పోయినఁ గాని ♦ కోర్టు కెక్కనివాఁడు
పోటీకి టీ త్రాగఁ ♦ బోవుచుండు
మాతను తాచారముల్ ♦ మఱచి పోయినవాఁడు
మధురమౌ కోకోను ♦ మఱచిపోఁడు

తే. అఖిల సంగపరిత్యాగి ♦ యైన కాఫి
మాట చెప్పఁగ ద్రాగక ♦ మానలేఁడు
సూర్యు నెఱుఁగనివారలఁ ♦ జూడవచ్చు
కాఫి యెఱుఁగనివారలఁ ♦ గాంచలేము.

సీ. శిష్యుని లెక్కింపని ♦ సిద్ధాంతి సీజరు
సిగరెట్టుకై ప్రొక్కి ♦ సేవసేయు
దివిజుల నోడించు ♦ కవి దిగ్గజముఁ గూడ
కాఫి యన్నను నమ ♦ స్కార మిడును
కుండలీంద్రుని గెల్చు ♦ దండి పండితుఁడైన
అయినను, సోడాకు జో ♦ హారు సేయు
ఆలుబిడ్డలు తన ♦ కేల యం చను యోగి
ఉప్మా యటన్నఁ గే ♦ లొగ్గి వేడు

తే. హిండ్డై నన్న విద్యార్థి దే ♦ హీ యటంచు
వడలటన్నను గురువు వ ♦ హ్వా యటంచు
తిరుగుచుండ్రు త్రికాలముల్ ♦ మఱవ కింక
కాఫి హోటలన్న నిజము స్వ ♦ ర్గంబు గాదె.

తే. వేడి వేడి కాఫిని నిచ్చు ♦ వేళ దాని
జూచినంతనె ప్రాణాలు ♦ లేచివచ్చు
కాంత లేకున్న మాననే ♦ కాలమందు
కాఫి యుండినఁ జాలు దుః ♦ ఖంబు లేదు.

ఉ. కాంతయుఁ గాఫి యొక్కటను ♦ గాఁ దగునా యని మిత్రుఁ డొందు రా
ద్ధాంతము సేయఁ జొచ్చె నది ♦ తథ్యము గాదు నిజంబు కాఫియున్
గాంతయుఁ జిత్తరంజన మొ ♦ నర్చుచు రందును కాఫి గర్భమం
దెంతయుఁబోయి హాయియిడి♦యీప్సితముల్ ఘటియించు; పైపయిన్
గాంత సుఖంబు గూర్చు నది ♦ గావునఁ గాఫికిఁ జాల వేవియున్.

తే. కాఫి యన్న సురాగంబు ♦ గాదు మాకు
కాఫి యన్నను రాగంబు ♦ గలదు మాకు
కాఫి రాగంబు కంటెను ♦ కాఫి యందె
మనసు లగ్నంబు జెందు నే ♦ మనినఁ గాని

తే. కాఫితో సంధ్యవార్చెదు ♦ ఘనులు గలరు
కాఫి కాదంబరీదేవి ♦ గాదె జగతి

... ... ...

... ... ...

ఆ. కల్లుపయిని నురుగు ♦ కాఫిలో వేడిని
నూదుకొనుచుఁ ద్రాగు ♦ చుండవలయు
కాని, కాఫి కున్న ♦ గౌరవ మల కల్లు
కాచ నందువలనఁ ♦ గలుగ లేదు.

## మత్స్నలు.

కలకలని నవ్వుచున్న వె ♦ న్నెల వెలుంగు
అమృతనిభమైన యీ ధవ ♦ ళాంశుకాంతి
నేల యీ మబ్బుతునుక మా ♦ యింపఁ జూచుఁ
ఈ నిశాకన్య యేల నీ ♦ లాలకములఁ
గప్పుచున్నదో యీ వరా ♦ గంబు దోఁగి
ఈ హిమాంబుధూమంబున ♦ నేకశత న
హస్ర కరములఁ గబళింప ♦ నరుగుచున్న
దీ మహాప్రేమ ప్రళయమం ♦ దేమి గలదో
ఈ మహారాగరసమునం ♦ దేమి గలదో ॥కల॥

జీవితం బను సీవహ్ని ♦ శిఖలనడుమ
హృదయనిర్భేదకంబైన ♦ యీ విషాద
గహనములమధ్య చిమ్మచీఁ ♦ కటులయందు
దేనిదో వెల్గు వెల్గదే ♦ గానవచ్చె
నింగి నెల లేదు ప్రణయ ల ♦ తాంగి నీల
నీరదాభ్యంతర పట కు ♦ టీరములను
తెఱచి మెఱపుతీఁగలు పన్ని ♦ యిరుల తెరలు
జారవిడువగ గాఢాంధ ♦ కారమైన
విశ్వనాటకరంగంబు ♦ వెడలిపోయె
ఘూకములు కూయుచున్న యీ ♦ చీఁకటులను
ఉల్కలును రాలుచున్న యీ ♦ యుగ్రములను

ఈ శిలావేదికలను మా ♦ హృదయఫలక
మందు గల వహ్నిదగ్ధ ప్రే ♦ మాక్షరములు
కాలి డాగైన నాయంత ♦ రాళ మిట్టు
లెవరు వ్రాసిరో యీ లోతు ♦ నీ రహస్య
మెవరు దీసిరో? యిది వార ♦ లె ట్లెఱుంగఁ
జాలిరో? ప్రేమపాతాలఁ ♦ జదువుకొనుచు
మేఘములఁ బోయి గర్జించి ♦ మింటి కెగసి
ఉడులఁ దిరుగుచు నేలకుఁ ♦ బడెడు జడుఁడు
వ్రాసియుండును; అది మహా ♦ జ్వాలలీలఁ
మండుచున్నది; ఆ వెల్గు ♦ నింపుచున్న
దింక దీనిని జల్లార్ప ♦ నెవరితరము?
ఇంక దీనిని వారింప ♦ నెవరితరము?

# ఏది నా పాట

ఈ ప్రణయగీత మెందుండి ♦ యేతెంచు
ఈ యపూర్వాత్మికాంత మే వ్యక్తి ♦ నెనసి వచ్చు
ఆ రసాత్మకాక్షర సమా ♦ ధ్యాయ మెందు
నణఁగియున్నది యెవరి దా ♦ స్యమునఁ గలదు.
దాస్యశృంఖలాబద్ధ హృ ♦ ద్వ్యవధూటి
కేది యీ రీతి స్వాతంత్ర్య ♦ మేది సొగసు
ఏది నా పాట నా గీత ♦ మేది కవిత.

విహ్వల నిషిద్ధ దైన్య జీ ♦ వితమునందు
విషసమారూఢ దగ్ధ ♦ జీవితమునందు
ఏది యీ రీతి స్వాతంత్ర్య ♦ మేది సొగసు;
ఇది యవాఙ్మానసంబు న ♦ తీంద్రియంబు
ఇది మహాశూన్యగళదణు ♦ పదరవంబు
నేను వాకొనుగీతంబు ♦ నేఁ దలంచు
భావ మీ జరదశరీర ♦ వాణి పాడి
పాడి ప్రకటించు ప్రకృతి ని ♦ వాళి యొసఁగ
ఇంక నాకు స్వాతంత్ర మిం ♦ తేని కలదె?
ఇంక నాకుఁ గర్తవ్య మే ♦ దేని గలదె?
మెఱపుతీవలు, రత్నాలు ♦ మేళవించి
మిణుఁగురులు వెన్నెలల వన్నె ♦ లనువుపరచి
ప్రేమరసవాహినులఁ దేలు ♦ వీచికలను
అల ప్రభాత నిశాంత నా ♦ ట్యానుబద్ధ
శర్వరీ కాంత మోహన ♦ స్వరవిలాస
మాధురీ మార్గణంబుల ♦ మాటునందు

మసలు జీవిత పాషాణ ♦ మండలంబు
మండి యెగయు బూడిదపయి ♦ నుండి రాలి
వ్రాయుచున్నది యీపాట ♦ పాంథకోటి
చదువుకొనునట్లు, కోవిదుల్ ♦ చదువునట్లు
ఇంక నీ పాట నా దని ♦ పించు టెట్లు?
ఇంక నీగీతి నా దని ♦ బొంకు టెట్లు?
ప్రణయ నిస్సాణ మదె మ్రోయఁ ♦ బయనమైన
యువక పథికుల వా గమ్రు ♦ తోపవృష్టి
అదె ప్రవాహవిధంబున ♦ నరుగుదెంచి
వీచికలచేత ఈ గీతి ♦ వెల్లివిరియ.
ప్రతిలతాగుల్మములయందు ♦ ప్రతిఫలించి
ప్రతిజలాశయమం దభి ♦ వ్యక్తి నొంది
ప్రతినదీగర్భమందుండి ♦ బయలుదేఱి
మ్రోయుచున్నది దిశలు మా ♦ ర్మ్రోయునట్లు.
పాడుచున్నది జగము సొం ♦ పారునట్లు
ఇంక నీ పాట నా దని ♦ పించు టెట్లు?
ఇంక నీ గీతి నాదని ♦ పించు టెట్లు?
ప్రాఁతపాటాలు వల్లించి ♦ ప్రాఁతకథలఁ
జాటి యీ నాటి కవితాన ♦ ఘాటి గట్టి
ప్రాఁత తొడవుల ముస్తాబు ♦ పరిథవిల్ల
వెదకి పాశ్చాత్య ఫేసు బూ ♦ డిదను పూసి,
పులిమి తలదువ్వి బిచ్చపు ♦ వెలఁది చేతి
బొమ్మ నాడించి నవ్వించి ♦ బుగ్గిచేసి,
ఏడ్చి కన్నీళ్లు దుడిచి మీ ♦ కింద మనుచు
నేను మీ ముందు పెట్టి మె ♦ ప్పించలేను;

నేను కవిని నా కల మీఁ జ ♦ గాన నొక్క
మాఱు ఖడ్గంబు కై పడి ♦ మాఱుఁగలను
ఒక్కమాఱు సంస్కర్త గా ♦ నోపఁ గలదు;
గాన కవితను నూత్నమా ♦ ర్గములఁ ద్రిప్పి,
క్రొత్త వన్నెల జగము రే ♦ కెత్తునట్లు
చేసి, చక్కెరతో సంపి ♦ వేసి నా స్వ
శక్తి యీశ్వరశక్తిగాఁ ♦ జాటలేనె?
దివిసి దివిజుల నేలకు ♦ దింపలేనె?

మొగ్గగా లేచి పూచి యే ♦ మో విలాస
పూర పూరితశాంతులు ♦ పొంగి పొరలు
నట్టి నానా విశీర్ణ పు ♦ ష్పాసవములఁ
ద్రావి మైకొన విరహ ని ♦ ద్రాణమైన
రమణి పద రాగముల నైక్య ♦ రమ గడించి
ఆమెపారాణి మైనిండ ♦ నలము కొనఁగ
ఆమె ప్రేమసామ్రాజ్యంబు ♦ నాచికొనఁగ
ఆమె దృక్పథ సర్వస్వ ♦ మందుకొనఁగ
వెడలి గేదంగి పూల పు ♦ ప్పొడుల ముగ్గి,
మాసి, రిమ్మెత్తిపోయి హ ♦ తాశమైన
భ్రమర మీ గీతి యెలుఁగెత్తి ♦ పాడుచుండ
తేటి యీ పాట నా దని ♦ చాటుచుండ
ఇంక నీ కైత నాదని ♦ బొంకు టెటుల?

పంచమస్వరాళికిని వి ♦ పంచికలకు
విరహములకు రాగరస సము ♦ ద్వేలమైన
పాతశాలను పెట్టి సొం ♦ పారునట్టి

కోకిలము చంచుపుటమున ♦ లోకమునకు
పాడి, వినిపించు నిది తొలి ♦ పాఠ మనుచు
చదివి వినిపించు నిది తొలి ♦ చదువుగాఁగ
ఇంక నీ పాట నా దని ♦ పించు టెట్లు?
ఇంక నీ గీతి నా దని ♦ బొంకు టెట్లు?

మనసు మనసును గలిపి యే ♦ మాటకైన
మరపు రాకుండుటకుఁ దన ♦ వరుని మనసు
కొంగులోపల ముడి వేను ♦ కొన్నయట్టి
ప్రేమకామిని హృదయార ♦ విందమందు
రేక రేక నీ పాట చి ♦ త్రించియుండ
స్వరము స్వరమున నీ పాట ♦ మెఱయుచుండ
పలుకు పలుకున నీ పాట ♦ కులుకుచుండ
ఇంక నీ పాట నా దని ♦ పించు టెట్లు?
ఇంక నీ గీతి నా దని ♦ బొంకు టెట్లు?

కవుల భాండార మిట్లు లో ♦ కము గ్రహింప
కవుల సర్వస్వ మిట్లు వ్ర ♦ క్కలయిపోవ
ఇంక శూన్యభాండముల లె ♦ క్కేమి గలదు?
ఇంక ముక్తకంఠముల జో ♦ లేమి గలదు?
గాన కవి విశ్వరూపంబు ♦ గాంచవలయు
ఇంక కవి విశ్వమై విని ♦ పింపవలయు.

# మేలుకొలుపు

మేలుకొనరే - జనులు - మేలుకొనరే॥

మేలుకొనరే నిద్రపోయెదరు
వేళ కాదిది తెల్లవారెను
కాలవాహిని పొంగి పొరలి వి
శాల విశ్వము ముంచుచున్నది ॥మేలు॥

క్షితిం జర స్థిర సంతతులు తమ
బ్రతుకు లను నాటకములో పలి
వెతలు ముగిసెను. నెదుటి తెరగతి
మతులు గప్పె సుషుప్తి యహహా
గతులు మార్చెను కాలనాథుండు
ధృతి ప్రభాత నిశాత సాయక
వితతి యడె వినువీధి పరపంగ
అతిప్రశాంత నిశా కవాటము
కుతుక మొప్పంగం దెఱచివచ్చెను
అతివపోలిక వేగుజుక్కం. ॥మేలు॥

కడలి సిరితోం బుట్టు కలువల
పడవ లెక్కి నదీనదంబులం
బడి వనాళి వసంతుతో జత
పడసి మలయ ధరాధరంబుల
వెడలి భిల్ల సరోజనేత్రల
జడల ముడిచెడు మల్లియల పు
ప్పొడుల దాంగుడుమూంత లాడుచు
నడచి మలయజశీతజలముల

కడిగి శుచిన్నై సౌరభంబుల
నొడిని నిడుకొని వచ్చె పవనుఁడు. ॥మేలు॥

కలయజాండము లదర నల్లని
వలువచే మేల్మునుఁగు గప్పియు
చెలఁగుచును బరతెంచి చీఁకటి
కలికి కన్నులకాటుకను తన
వెలుఁగుతోఁ గడు దిద్ది కుంకుమ
తిలక ముంచినరీతిఁ దనరుచు
శలభములు ఫలకాంక్ష సేయుట
వలనఁ గలిగెడు ముప్పు లెట్టివో
తెలుపుచును సంన్యస్తపోలిక
నిలిచి వెలవెలఁ బాఱె దీపము. ॥మేలు॥

విరుచుపరచి వనాంతమను ప
ళ్లెరములో కప్పురపుహారతి
వరలఁగా వసరమ యొసఁగిన
కెరఁగి స్వాగతముల నొసంగఁగ
పరభృతాది శుకాంగనలు తమ
స్వరసుధారసధార లొలుకఁగ
గిరులు దరులు ప్రతిధ్వనింపఁగ
తరుల నెక్కి వసంతగీతము
లరసి పాడుచు నందులో నీ
శ్వరుని తేజము గాంచు సమయము. ॥మేలు॥

చెఱకువిల్లును వంచి విరహుల
విరుల శరముల ముంచి యెత్తిన
మరుఁడు క్రూరనిశాచరుఁడు తన

చరిత్రముల కతిలజ్జఁ జెందుచు
పరలె దిక్కు-మొగంబుతో నా
సాఁగునని విహరించి వెన్నెల
బుసలలోన వియోగులను కను
మరలఁజేసి విషాదపెట్టిన
భరమునను సంబరము విడిచియు
చరమగిరి కేతెంచె చంద్రుఁడు. ॥మేలు॥
తోయజంబులు నిద్ర లేచెను
తోయజాక్షులు లేచి గంగా
తోయములకై పోవుచుండిరి
తోయజుఁడు రేయెల్ల వెన్నెలఁ
గాయుచును చరమాద్రి నిలిచెను
ఆయు వల్పము తెలియ రేమని
తోయదంబులఁ బ్రకృతి గంటలు
వేయుచున్నది కోళ్లు కొక్కొరొ
కో యటంచును దిసలు బీఁటలు
వాయగా నదె యఱచుచున్నవి. ॥మేలు॥
పవనములు కామములు నింద్రియ
వివశమైన మలీమసస్థితి
దవులకుండఁగ జ్ఞానజాహ్నవి
నెవఁడు హృదయము కడిగివేయునో
అవల వారల బ్రహ్మజిజ్ఞా
సాంతరంబు తమంబు బాసియు

ప్రవిమలంబగు తెలివిలో నీ
శ్వరుని తేజము దోంచుకై నడి
దివిని జలధిని నిసిని విడిచియు
రవి యదే యుదయించె నభమున. ॥మేలు॥

పవనములు కామములు నరిష
డ్వర్గములు బిగు వణఁగిపోఁగన
నవల గంగాజలము పోలికి
నాత్మ మిగుల పవిత్రమై తొలి
పరిచయంబులు విడిచి విలసిత
బ్రహ్మజిజ్ఞాసాంతరము మది
దవిలి తమస్సును బాసి యీశ్వర
తత్త్వమున తేజంబు గాంచెను
ప్రవిమలాత్మని తెలివికై నడి
రవి యదే యుదయించె నభమున. ॥మేలు॥

నిద్రపోయె నదే చతుష్క న
ముద్ర ముద్రిత లోకజాలము
నిద్రపోయెను భూతకోటి యు
పద్రవంబులఁ దగిలి మాయా
నిద్ర తొలఁగిన బ్రహ్మవేత్త ల
నిద్రదీప్తి స్వారాజ్యదుర్గము
భద్రముగ కాపాడి దేశ·ద
రిద్రమును తెగటార్చుఁడో యన

నిద్రపోదురె భారతీయులు
నిద్రపోదురె వీరవనితలు. ॥మేలు॥

కాల మనయము లోకమును నీ
ఏల కేలఁ బవళ్ల కథములఁ
దోలి తోలి రజంబుకై వడిఁ
దూర్చి పూచిన పువ్వులో యన
నేల రాల్చి విషాభ మగు నీ
వ్యాళపుము తెగఁగార్చు మంత్రము
లాలకింపఁగ నదిగో శ్రీ మహా
ఖై లలీగుఘఁ డిచటనే ఉం
చాలిపాకవి కెఱుకఁ బలికెను
వేళ బ్రహ్మముహూర్త మియ్యది. ॥మేలు॥

# జీవిత నాట్యము

గడచిపోయిన జీవిత ♦ కాల నాట్య
రంగమున చేసినట్టి వ ♦ ర్తనము సందు
ప్రతిపదము క్రింద ముండ్లె గ ♦ న్పడుచు నుండె
ప్రతి నిషిద్ధ వాతావర ♦ ణ తతియందు
చీమలే పట్టుకొనుచుండె ♦ నేమొ గాని
శాంతి యెక్కడి దింక ది ♦ గంత దృశ్య
మైన సౌందర్యమున లీన ♦ మైన తెరల
చాటుమాటున బ్రతుకను ♦ నాట కాంత
రాగమెత్తి పాడుచు నను ♦ రాగరసవి
శేషవాహిని హృదయ సం ♦ క్షిప్త భూము
లందు పారించి ప్రేమ రా ♦ జ్యముల నేల
ఏది యవధాన మీా దగ్ధ ♦ పాదపముల
మోల సుడిగాలి ముంగల ♦ బోర్ల వడ్డ
శూన్యఘటము దీనిని నేరు ♦ చూడఁ గలరు!
నెచ్చెలులపొంత ప్రాంత వ ♦ నీ విలాస
లాలన పథాల వెన్నాడి ♦ లాస్యహాస
భాసితశ్రీల ప్రొద్దులు ♦ మోసులెత్తఁ
బుచ్చుటకు నీ ప్రకృతి తోడు ♦ వచ్చుమాట
లేకపోయెను; రంగ వ ♦ ల్లికలయందు
మురువుసూపు నిగారంపు ♦ ముత్తెసరుల
క్రేవలందు పూఁదీవ వా ♦ కిళ్ళయందు

పచ్చతోరణములఁ గట్టి ♦ పళ్ళెరముల
హారతి యుషస్సునకు నిచ్చి ♦ అంజలిని ఘ
టించి స్వాగతమిచ్చి య ♦ ర్థించి కురుల
యిరుకులను గ్రాలు తలఁబ్రాలు ♦ విరులు గురియ
వాసనలఁ దోఁగి, వలపుల ♦ వ్వాలు విరియ
నవ్వులను దేలి జీవిత ♦ నాటకాంక
మును చతుర్థాంకముగఁ జేయు ♦ టనునది గన
లేదు; ముంగిళ్లు ముసుగులు ♦ లేవనెత్తి,
యిరుగు కాటుకపట్టి క ♦ న్దెరల నిరికి,
పసుపు లెత్తి రసస్వయా ♦ సముల దాసి,
వాసిమోయి పొలయల్కలం ♦ దోసిళులను
బోసి, బతిమాలి, మోము మో ♦ ములను జేర్చి,
ఏడ్చి, కన్నీళ్లు దుడిచి, యే ♦ మేమొ బాస
లాడి, వగలాడి వేడుక ♦ యాగడముల
కేసి కన్నెత్తి చూడలే ♦ దాసమాత్ర
ముండిపోయెను పగిలిన ♦ గుండెలందు.

## చాతకము

ఉ. ఛాతకపక్షి ! నీవిల ని ♦ జంబుగ సద్గుణ రాశివంచు నీ
నీతికి నీ మనోహర వి ♦ నిర్మల బుద్ధికి సంతసించి వి
ఖ్యాతిగఁ జెప్పుకొందురు గ ♦ డా నిసు నీ దగు భాగ్యమే మను నీ
జాతి ఖగంబు నింక పినఁ ♦ జాలము చూడము ముజ్జగంబులన్.

చ. పరభృత మున్నదన్న నది ♦ పక్షులలోఁ గను ప్రౌఢయైనఁ దా
పరవాలలపాలి శత్రువు న ♦ పీన సుమాస్త్రుని పెద్దబంటు సుం
దర శుకచక్ర శారికలు ♦ దర్పకు సైన్యము రాజహంస మా
సరసిజనాళ భక్షకము ♦ చాతకమా యివి నిన్నుఁ బోలునే.

శా. గూడా లేదు; లతావనీరుహములన్ ♦ గూర్చుండ ; పీ కుక్షికిన్
గూడా యొల్లవు; నీరుద్రావవు బలే! ♦ గ్రుడ్డెట్లుగాఁ బెట్టెదో
జోడేరీతిని గట్టెదో నిదుర యె ♦ చ్చోఁ బోదువో నింగిపై
నాడన్ రెక్కలు నొవ్వవో శ్రమముగా ♦ దా వేద సారంగమా

ఉ. చంచున గింజ లేరికొనఁ ♦ జాలవా ? కూపనదీజలంబు భ
క్షించుటలేదా ? యాకలి న ♦ శించెడి మందులు త్రాగినావా ? ప
క్షించితో కూడు యోగివయి ? ♦ జీవము లేగతి సల్పె ? నెట్లు స
ద్ధించెను నీకు నిర్మలిన ♦ దివ్యశరీరము వానకోయిలా ?

ఉ. సొంపగు నీచరిత్ర మతి ♦ చోద్యము వర్షజలంబు ద్రావ వ
ఛింపుదు వంట నిత్యమది ♦ చేకురునే ? యిటు లెన్నినాళ్లు జ
వింపుచు నింగినాడెదవు ♦ విప్పిన రెక్కలు మూయకుండ ? నూ
హింపగరాదు నీకుఁ బర ♦ మేశ్వరుఁ డేమి యనుగ్రహించెనో.

ఉ. పక్షులలోన నీవు కడు ♦ పండితురాలవు గాఁగ నేదియున్
భక్షణ సేయకుండ నుప ♦ వాసవ్రు దీక్ష వహించితంచు నా
రక్షకుఁ జందరన్ గనుచు ♦ రాజగుటన్ నినుఁగూడఁ బెంపగా
శిక్షణ జేసి వాన గురి ♦ పించునొ నేమొ యెఱుంగ శక్యమే.

ఉ. ఆకలినేనిచా రవని ♦ యందు గనంబడ రేదొ వేళ కే
యూహలొ నీరక్షీరములో ♦ యూనఁగఁ బోయెడువారె గా, యిసీ
నీకరణిం గనంబడరు ♦ నిగ్గుకు లొక్కరె తప్ప నానుగా
నాకనినాస మిరగ్రకు ♦ నైజమె వేఱుగఁ జెప్ప నేటికిన్.

ఉ. భూమి వసించువారు పౌర ♦ పౌచ్చెముఁలం బడి యాలుబిడ్డలం
దే మమకార ముంచి పర ♦ మేశ్వరుఁ గొల్వరటన్న బుద్ధిచే
నేమివ్రతంబు సల్పినను ♦ నెచ్చటి కేగిన వానకారునం
దేమగ కొక్కమాట స్మరి ♦ యింపుము సత్కవి వీవు గావునన్.

చ. నెల.లిరునాల్గు సిఁగిపయి ♦ నిల్వన నీరయి నిల్చియుంటి నా
కలరస మూరె నేటి దిస ♦ గండము దాటె నటంచు ద్యోదిశన్
జలదము దోప వేచుకను ♦ నాగకు నీటికణంబొ లేక లో
పల వడగల్లొ చూచి మరి ♦ భక్షణసేయుము హంసకోయిలా.

చ. దగఁ గొని యాకటల్ దడసి, ♦ దప్పాత నొందెడువేళ నోటిలో
దిగుటకు నీళ్ళొ పాలొ మఱి ♦ తియ్యని పండులొ లభ్యమైనచోఁ
దగు; నది ప్రాణముల్ నిలుపుఁ ♦ దద్దయు స్వర్ణము నాణెముత్తెపుం
నగలు లభించినన్ వృథ ధ ♦ నంబునకున్ విలువన్న దున్నదే.

ఆ. ఇట్టి ఘోరమైన ♦ యీ కానలోన దా
హాగ్ని కింధనంబు ♦ నైనవేళ
నోట ముత్యమున్న ♦ పాటి మన్నుండిన
ఫలము లేదు స్వాదు ♦ జలము వలయు.

ఉ. ఆకటిచేత నేలఁబడి ♦ యాశలు రాలఁగ నంగలార్చు నీ
వ్యాకుల శోకతప్తునకు ♦ స్వర్ణ కిరీటము నెత్తి నుంచినన్
శోక తట్ట పెట్టినను ♦ లేదు సుఖంబును నేగి త్యాగ భో
గాకరమైన యీ తనువు ♦ నన్నమయం బని యెంచఁగాఁ దగున్.

ఆ. కాన దీని నెల్ల ♦ గను గొని విబుధుండు
ఉన్నమట్టుకు దిని ♦ యుండు నింట
గాని యర్థవాంఛ ♦ కడగండ్లపాలయి
ఛావఁబోడు లోభి ♦ చచ్చినటులు.

# అహింసాగీతము

జగము సృజియించినట్టి యీ ♦ శ్వరునిఁ జూడు
పంచభూతాలు వాని యే ♦ ర్పాటుఁ జూడు
సూర్యచంద్రుల చక్కని ♦ శోభఁ జూడు
కాల పరిణామ వైచిత్ర్య ♦ గతిని జూడు
ఎంత వింతఁగఁ దోఁచు నీ ♦ యంత రాత్మ
నిన్న పూయని లతలు నేఁ ♦ డెన్ని పూలు
పూయుచున్నవి సొగసు పు ♦ ష్పముల జల్లి;
నిన్న పారని యేళ్లు నేఁ ♦ డెన్ని నీళ్ల
నొసఁగుచున్నవి తల్లి పా ♦ లో యనంగ;
ఫలరసాదులు వృక్షముల్ ♦ పగలు రేలు
గురియుచున్నవి జీవముల్ ♦ సుఖియునట్లు;
గడ్డిగసరుల మేయు గో ♦ గణము పాల
నిచ్చుచున్నది కరుణ రే ♦ కెత్తునట్లు;
వానికై మనఃపూర్వక ♦ స్వాగతంబు
పంపి మనయాత్మ వాని క ♦ ర్పింపవలయు
అదియె పుణ్యంబు మోక్షాన ♦ కదియె దారి.
అదియె యోగంబు భాగ్యాన ♦ కదియె తెఱవు
దీని కన్యంబు వృథ యని ♦ తెలియవలయు
గోవులను బఱ్ఱెలను పాలు ♦ గ్రోలి వాని
గోయువాఁ డెంత క్రూరుఁడో ♦ వ్రాయఁ దరమె?
రాతికంటెను కఠినుఁ డా ♦ రాక్షసుండు
రాక్షసునికంటె ద్రోహి యా ♦ రాజసుండు
నోరెఱుంగవు, కొట్టిన ♦ నూరకుండు

అరచి తమ మొఱ్ఱ నెవ్వఁ డీ ♦ శ్వరునితోడ
చెప్పుకొన్కు గాని మనతోడ ♦ చెప్పుకొనవు
మనబరువు మోచి యెంతో బా ♦ ధను సహించు
మనకొఱకు పాల నిచ్చి వే ♦ దన సహించు
వాని గోయుటకంటె పా ♦ పంబు గలదె
వాని దినుటకంటె వేఱు పా ♦ పంబు గలదె
పాలు ద్రావి రొమ్మును గ్రుద్దు ♦ వారికంటె
యేరు దాటి తెప్పను గాల్చు ♦ వారికంటె
కఠినపాషాణ మని వాని ♦ గాంచవలయు
పిట్టపిడుగని వాని భా ♦ వింపవలయు
జీవహింసను మాన్పిన బుద్ధ ♦ దేవుఁ దలఁచి
యజ్ఞధేనుల కాపాడి ♦ నట్టి వైష్ణవ
మతగురుండు మధ్వాచారి ♦ మార్గ మెంచి
వేదమున యజ్ఞమున బలి ♦ లేదటంచు
దెల్పు నలదయానందు నం ♦ దేశ మరసి
లేడిపిల్లను వదలి పా ♦ లిచ్చు తల్లి
నూఱడించు సిబక్తజీన్ ♦ తీరు గాంచి
పరమదయ కాకరంబైన ♦ వారి మన క
బీరు నలగాంధి మున్నగు ♦ ధీరమతుల
నెంచి జీవహింసను విస ♦ ర్జింపవలయు
పుణ్యధనులార! భారత ♦ పుత్రులార!

# విద్య

ఉ. విద్య మహాపదార్థము వి ♦ వేక కళాలసితంబు నైన దీ
విద్య చరాచరంబయిన ♦ విశ్వ మెఱింగెడు చూడ్కి వంటి దీ
విద్య బలంబు, తేజము, ప్ర ♦ వీణత నిచ్చును సర్వధర్మ సం
వేద్యమునైన నీ పరమ ♦ విద్యకు మించిన భాగ్య మున్న దే.

చ. యవను లరబ్బు లార్యులు మ ♦ హా విభవంబున శౌర్యధుర్యులై
యవని జయధ్వజంబులు ది ♦ శాంతములన్ నెలకొల్పిరంచుఁ ద
ద్భువి జనాల కీర్తిగీతములు ♦ పాడెద రా విభవంబు విద్యచే
గవిసెనుగాని కోట్బలత ♦ ఖడ్గబలంబునఁ గా దొకప్పుడున్.

సీ. మధుమాసముల ♦ మేయు మావిచిగుళ్లకై
పంచమస్వర మభ్య ♦ సించుఁ బికము
కుసుమాసవము ప్రేమ ♦ మెసవి వినోదింప
వనచరత్వము నేర్చు ♦ కొనును తేటి
మేఘమాలికతోడ ♦ మిత్రానురాగంబు
ప్రకటింపఁ గఱచు న ♦ ర్తనము నెమిలి
పూఁదీవ తీవకుఁ ♦ బోయి తేనె గడించు
పాండితి నలవాటు ♦ పడును సరఘ

తే. ఇట్లు జడములు సహజ సా ♦ హిత్యగరిమ
ప్రకృతిని నలంకరింపుచుఁ ♦ బరఁగుచుండ
మనుజుఁడై పుట్టి విద్య నా ♦ ర్జనవిధంబు
వదలినాఁ డన్న జీవచ్ఛ ♦ వం బతండు.

సీ. కాటుకలట్లు చీఁ ♦ కటు లజాండము నిండఁ
దూలించి మెఱయు ఖ ♦ ద్యోతమందు
రోదసీకుహరంబు ♦ మ్రోయు నుషస్సుల
నెలుఁగెత్తి పాడు ♦ కోకిలమునందు
కంటకంబులు చుట్టు ♦ కఱకొని యుండిన
నవ్వుచుండు గులాబి ♦ పువ్వునందు
మాంసమిశ్రిత మలీ ♦ మసమైన శుక్తిని
దీపించు నాణెము ♦ త్తెమ్మునందు

తే. ప్రణయవతి సాధ్వి ప్రేమ హృ ♦ త్సరసిజమందు
కట్టియును లోహ మగు కవి ♦ కలమునందు
గోపబాలుని పిల్లన ♦ గ్రోవియందు
విద్య రసముతో నైక్యమై ♦ వెలయుచుండు.

తే. విద్య చదువుటచేతనే ♦ వెలయఁబోదు
విద్య యాచరణంబున ♦ వెలయఁగలదు
విద్య లోకార్థమేగాక ♦ విద్య తనను
తానెఱుంగుటకై యుండు ♦ తథ్యముగను.

తే. విద్య కుక్షికినై వెచ్చ ♦ పెట్టరాదు
కోటివిద్యలు కూటికై ♦ కూర్చువారు
రేగుపళ్లకు మణుల న ♦ ర్పించునారి
వంటివారని తెలియఁగా ♦ వలయు నెపుడు.

తే. విద్య పొట్టకూటికి లేక ♦ విక్రయించు
వాఁడు పండ్లచెట్టును గొట్టి ♦ వంటకట్టెఁ
జేసినట్టుల యగును; న ♦ న్యాస్తికైన
విద్య భాగ్యంబు గూర్చు నే ♦ వేళకైన.

తే. రాజు నాశ్రయించెడువాఁడు ♦ భోజనమున
కిన్ని యటుకులు దొరకక ♦ ఖిన్నుఁ డగుట
సంభవించును; సూ సర ♦ స్వతిని నాశ్ర
యించువాని కాబాధ రా ♦ దించుకైన.

తే. ఎందఱో విద్య నేర్చి యుం ♦ దండు భైక్ష్య
పాత్రహస్తులై యాచించి ♦ బాధపడుట
పరయుచుంటిమి, నిజ మట్టి ♦ పురుషులందు
గల దురభ్యాసములె దాని ♦ కారణంబు.

ఉ. అంచితవిద్య నేర్చి యది ♦ యాచరణంబునఁ బెట్టి దాని జూ
పించనివాఁడు వ్యర్థుఁ డవి ♦ వేకి నిజంబుగ గ్రుడ్డివాని చే
నుంచిన దీపమట్లు అతఁ ♦ డుర్వ్యజనావళికెల్ల మేలు గా
వించును గాని వాని కొక ♦ వీసము లాభములేదు జూడఁగన్.

ఆ. అట్టివాని వయసు ♦ వ్యర్థంబు నర్థంబు
బెట్టినాఁడు గాని ♦ యొట్టి పస్తు
వైన గొననివాని ♦ యటు పోవు నను జ్ఞాన
మెఱిఁగి పండితుఁడు చ ♦ రింపవలయు.

# నవ్వు

రూఢమై శాంత తేజస్స్వ ♦ రూప మగుచు
సదయమై ప్రపుణ్యమయి ని ♦ ష్కపట మైన
నవ్వుమోమును మేము నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

ద్యోదిశను మేఘమాలలోఁ ♦ దోఁచునట్టి
మెఱుపుకై వడి రత్నాల ♦ సరములందు
తళుకువలె చంద్రచంద్రికా ♦ ధవళపరిమ
ళంబులై యొప్పు పుష్ప చ ♦ యంబుపగిది
నవ్వుమోమును మేము నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

ఇద్ధ జీవితవార్ధి దా ♦ టించు నావ
ఆయు వను గాలిపడగను ♦ నాపు త్రాడు
కాలకన్యాలలామ ర ♦ త్నాలమాల
సతి ప్రణయకోప మేఘజం ♦ ఝానిలంబు
వైరి వీరవచస్సర్ప ♦ గారుడంబు
విమల శాంతరసంబుపై ♦ వీచుగాలి
ప్రేమలత మనోవని పెట్టి ♦ పెంచుమాలి
వాంఛ యను చారుశుక్తికి ♦ స్వాతివాన
రాగ రోగాగ్ని నార్పు వ ♦ ర్షాగమంబు
సకల విభవార్థ కుసుమ వ ♦ సంత ఋతువు
మోక్షలక్ష్మికి పరునకు ♦ మోహలేఖ
ఉదిత విజ్ఞానశరధి కిం ♦ దూదయంబు

ప్రేమ నిండార నవ్వి న ♦ వ్వించు నవ్వు
నవ్వు మోహమును వేయు నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

నవ్వులేని మొగంబును, ♦ పువ్వులేని
వనము, నవయౌవనంబున ♦ వలపులేని
తరుణి, జ్ఞానంబులేని వి ♦ ద్యా విధాన
మట్లు శోభావిహీనమై ♦ యుడుగుచుండు
దాచి తీయనిబుల్లునా ♦ తోఁచుచుండు
నవ్వు మోహమును వేయు నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

నవ్వు నాల్గువిధంబుల ♦ నప్పు ననుచు
నవ్వు మాయాప్రధాన ♦ ము ♦ న్మాద మనుచు
నవ్వు నీచసూచక జనా ♦ నంద మనుచు
నుడివినను మాకు వానితో ♦ సబుసు లేదు
తెగడినను మాకు వానితో ♦ తగవు లేదు
మాకు నిర్మల మగు నవ్వు ♦ మహితమైన
ప్రేమ మానందజనక జీ ♦ వితము వలయు
విషపునవ్వును మొగలంట ♦ పీడవలయు.

మనుజుఁ డేగినఁ, వాని న ♦ వ్వును విలాస
భాసురంబగు ప్రేమ మీ ♦ ప్రకృతియందు
మెలసి చిత్రింపఁబడు; వాని ♦ దలఁచువారి
కతని నవ్వుమొగంబు ప్ర ♦ త్యక్ష మగును
నతని నిష్కపటాకృతి ♦ యర్థ మగును.

నవ్వుమోమున ప్రేమను ♦ నివ్వటిల్లు
జవ్వని మనోహరాంగి నీ ♦ చాన నెపుడు
మఱవఁగాఁ గలవాఁకొక్కొ? యే ♦ మాయనూరి
మందు దిన్న విరోగార్తిఁ ♦ గుందుచున్న
సతులతో వేడ్క నుదయించి ♦ శాంతశీత
కాంతి నల్దెస లలమ ని ♦ శ్చింతలీల
నవ్వువెన్నెల లలర శూ ♦ న్యమునఁ దోఁచు
చంద్రు నెన్నఁడు మఱవఁగా ♦ సాధ్య మగునె
తామరస మిత్రనేత్ర సం ♦ దర్శనాప్తి
నిండి నిండారు మోదంబు ♦ నెగడుచుండి
నవ్వునట్టుల వికసించి ♦ నైజకాంతి
వెలసినప్పుడు వీక్షించి ♦ కలలనైన
మఱవనేర్తువె నీవు నీ ♦ సరసిజమును?
ఇట్టులే నవ్వుగూర్చి యూ ♦ హించుకొనుము
ఇట్టులే నవ్వుకై యుపా ♦ సించుకొనుము
నవ్వుమోమును మేము నా ♦ నందదేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

# భారతీసమితి

తే. ప్రకృతి తెరలోన దాఁగి తాఁ ♦ బాటపాడి
రంగమున వచ్చి తానె పా ♦ త్రగ నటించి
ప్రేక్షకుండయి చూచు తా ♦ విశ్వమూర్తి
భారతీసమితికి నాట ♦ పట్టు నగుత.

ఉ. భారతికిన్ నిరంతర ము ♦ పాస్యము లైన తెలుంగుబాస శో
భారతి తేనెతేట లగు ♦ పల్కుల నామె నుతించుచో నలం
కారములై యొసంగు రస ♦ గౌరవభక్తి సువర్ణదీప్త నా
నారవణాలమాలగ త ♦ నర్చు నిజం బిటఁ జెప్పవచ్చినన్.

ఉ. ఏ వసుధన్ జనించితివొ ♦ యెవ్వరికోసలవో గదమ్మ వి
ద్యావతి! యాంధ్రభారతి! య ♦ థార్థముగా మొనమొన్న నీవు గో
దావరి తీరమందున గ ♦ గా నభిఖ్యుంచితి వాంధ్రజాతి గీ
తావళి పాడుచున్ లయకు ♦ నందెలు మ్రోయఁగ నాట్యమాడుచున్.

ఉ. ప్రాక్తను వెట్టిదో తెలియ ♦ రాదు భవత్సహజస్వరూప సం
సక్తినిబట్టు కాంచినను ♦ సంస్కరణంబులఁ బొందియున్న నో
వ్యక్తిగఁ దోఁచు భారత మ ♦ హా మహితంబగు సత్ప్రబంధ మాం
ధ్రోక్తినిఁ బాడుచుండ విను ♦ చున్నది లోకము నేఁడు భారతీ.

మ. సహజంబైనది కొంత కృత్రిమమ్మునై ♦ సంస్కారలభ్యంబునై
మహితంబైనది కొంత తెల్గుకవితా ♦ మార్గంబుఁ జర్చించి త
న్మహనీయస్థితి భారతీసమితి సం ♦ భావించి భాషించు లో
క హితార్థంబుగ దీని నీశ్వరుఁడు ని ♦ క్కం బద్ధి కాపాడుతన్.

# అక్షరపథం

1. ఎంతకాలంబు కన్నీళ్ళ ♦ నీ విధాన
కార్చి యెలుఁగెత్తి యేడ్చి నిన్ ♦ గాంచలేక
జీవములుపుత్తునో స్వామి ♦ చెప్పవేమి?
ప్రాణములు నిల్పుదునో స్వామి ♦ పలుకవేమి? ॥ఎం॥

2. అహములు ప్రభాతములు సంధ్య ♦ లణఁగుచుండె
యుగములు యుగాంతరము లిట్లు ♦ తెగిపోయె
కరకురాతిని బోలు నా ♦ కఠినమనసు
కరగకున్నది నీప్రేమ ♦ శరథిలోన
సమయకున్నది నీ కళా ♦ జ్వాలలందు
యేవిధంబున నినుఁ జూతు ♦ నేవిధాన
నిన్నుఁ జేరుదు? నాకింక ♦ తెన్ను గలదె? ॥ఎం॥

3. విశ్వమానవలోకంబు ♦ వెదకినాఁడ
వెడలి రోదసీకుహారాలు ♦ వెదకినాఁడ
గగనవీధులు, ఘోరరాస ♦ కాననములు
గిరిదరీద్వార ఘోర దు ♦ ర్భరవిషణ్ణ
నిమ్నసోపానములఁ బడి ♦ నేలరాలి
లేచి యొగఁబ్రాకి ప్రాకి నిన్ ♦ జూచుకొఱకు
జతన మొనరించినాఁడ నా ♦ శక్తికొలఁది
గాని నీజాడ సుంతయుఁ ♦ గానఁబడదు
నీస్వరూపం బాకింతయు ♦ నెఱుకఁ బడదు
పలుక రెవ్వరు తెలిసిన ♦ వారు లేరు! ॥ఎం॥

4. స్నిగ్ధ ధూళిధూసరతమో ♦ చ్ఛిన్నశప్త
పులినసీమలలో సెలయేటి ♦ పొంతలందు

విరులు గురిసెడుచోట్లో ? సుం ♦ దర శకుంత
ముల రుతంబులు మిన్నులు ♦ ముట్టుచోట్లో ?
యెందు నున్నావో నీనెల ♦ వెందు గలదో ?
పలుకరెవ్వరు తెలిసిన ♦ వారు లేరు ! ||ఎం||

5. తుద మొదలు లేని నీరూపు ♦ దోచ కెన్నొ
పాట్లు పడి గొంతుకెత్తి నిన్ ♦ బాడి, పాడి
యలచినాడను కంఠంబు ♦ చిరిగిపోయె
వెన్నుపూసలు సడలె సి ♦ ర్లిణ్ణమైన
వీణతంత్రులు తెగిపోయె ♦ వ్రేళ్లనుండి
కటికిరక్తంబు బొటబొటఁ ♦ గారఁజొచ్చె
ప్రాణములు సొమ్మసిల్లెనో ♦ స్వామి నీవు
గానగారావు నేను నిన్ ♦ గాంచకుండ
బ్రతుకఁజాలను నీప్రేమ ♦ పట్టలేను. ||ఎం||

6. ఏమి సేయుదు సుసుర్లైన ♦ నెగిరిపోదు
అకట అప్పుడైన నాకట్టె ♦ నరయుకొఱకు
వత్తువో లేదో వచ్చిన ♦ వత్తు వేము
నీ పదరజంబు సోకి నే ♦ నెప్పటివలె
లేచివచ్చెద సుమ్ము నిన్ ♦ జూచుకొఱకు. ||ఎం||

7. ఒక్క కన్నీటిచుక్క కొ ♦ కొక్కచుక్క
వ్రాసినాఁడను నీప్రేమ ♦ పట్టలేక
హృదయకుహరంబు చింపి నీ ♦ క్షిండినాఁడ
నీవు నవ్వుచు కన్పించు ♦ నావు దేవ
ఇట్టు లుంరాలిపాకవి ♦ యెఱుక చెప్పె.

# సంందె

౧

తీగ తెగిపోయింది
అయ్యయ్యొ
తీగ తెగిపోయింది
తంబురా
తీగ తెగిపోయింది
ఆలాగె
రాగ మాగిపోయి
జోగిపోతుంది
రసములో
సాగిపోతుంది.

౨

సందె పడిపోయింది
అంతట
అంద మేదో వచ్చింది
ఇందులో
చందమామ మున్నాడ
ఈ రేయి
చందురుని తెగనాడు
పువ్వొక్క టుంది
ఆ నవ్వె
అంద మిస్తుంది.

3

పడవ పోతూ ఉంది
ఆ యొడ్డు
గడచి పోతూ ఉంది
ఆ యేరు
పొడిచి వడి యెక్కింది
అందులో
నడుపువా రెవ్వారో
పాడుచున్నారు.
పాటలో
ఒడలు మరచారు.

४

ఆ మధువు గొని వచ్చి
ఆ లేమ
సామగానము చేసి
నవ్వుచు
ప్రేమపాఠము చెప్పి
పోవుచు
తిరిగి చూచింది
గుండెల్లో
రాయి విసిరింది.

౫

ఆ ప్రొద్దు వ్రాలింది
ఇంతలో
ఈ ప్రొద్దు పొడిచింది
పాటలో
ఆ ప్రభాతవధూటి
ఎలు గెత్తి
ఆ పొలతి పాడిన
ప్రేమ ప్రళయంబు
రుధిరంబు
కురిసె హృదయంబు.

౬

మచ్చు పడిపోయింది
నా గుండె
ఉత్సవము పోయింది
ఈ జన్మ
వచ్చి పోయిం దిట్లు
వలపులో
చచ్చిపోయెనా
అప్పుడైన
స్వేచ్ఛ కలిగెనా !

# నా కింక మరణ మేది?

నా విషాద కథావిధా ♦ నంబుఁ జెప్ప
లేను, వ్రాయగా లేను, నా ♦ లోనె యీ హు
హాగ్ని చల్లారవలయు; కా ♦ ష్ఠానుషంగ
మైన ధూమంబు శిఖి లీన ♦ మైన పగిది
మెఱసి మేఘాలతోఁ బోవు ♦ మెఱపులాగు    నా॥

మరణవేదనా దోదూయ ♦ మాన మాని
తంబు నగు దీని నెవ్వారు ♦ తలఁపఁగలరు
ఘోరమగు దీని నెవ్వారు ♦ కోరఁగలరు    నా॥

కాదు తెలిసికొనెడు కోర్కె ♦ గలదయేని
నా విషాద కథావిధానంబు ♦ నా కవోష్ణ
బాష్పావృతాక్షు లీ ♦ యుర్వి రాలి
వ్రాయుచున్నవి నా రుధి ♦ రంబుచేత
అరయుచున్నవి నా హృద♦యంబుచేత
చెప్పుచున్నప వినుఁడు నా ♦ జిహ్వాచేత
సాంధ్యరాగాలవలె మీరు ♦ చదువుకొనుఁడు
ఆ ప్రభాతాలవలె మీర ♦ లాచికొనుఁడు
ఎఱ్ఱకలునలవలె నెత్తి ♦ నెత్తుకొనుఁడు
దీపకళికలవలె నెదఁ ♦ దీసికొనుఁడు    నా॥

పద్దుచే బ్రద్దలైన నా ♦ హృదయసీమ
క్రక్కుచున్నది నెత్తు రా ♦ కంఠలుంఠ
నోగ్రయగు యజ్ఞపశువన ♦ నొప్పి యహాహా
ప్రేతభూతంబు లవి ద్రావి ♦ భీతిరహిత
ప్రేమగీతాలు స్వేచ్ఛగా ♦ పేరుఁ బెట్టి
పాడుచున్నవి యారతా ♦ భ్రములు సుధను
గురియుచున్నవి నాకింక ♦ మరణ మేది—

# అల్లాప్రభు

శా. శ్రీలీజాలిన మేటి వంచెఱిగి నే ♦ సేవింపగాబోను, నా
శ్రీలన్ గైకొననెంచి కుంటినయి న ♦ ర్థింపంగ రాలేను నీ
శ్రీలావణ్య ప్రపూర్ణ మార్గమున నా ♦ చిత్తంబు సంధిల్ల నే
వేళన్ గొల్చెద భక్తి పూర్ణమతినై ♦ విశ్వజ్ఞ అల్లాప్రభూ! 1

మ. నిను జింతించి భజించి మ్రొక్కి మదిలో ♦ నిత్యంబు సేవించి నీ
వినుతిం జేసియు దానికిన్ ఫలముగా ♦ విశ్వజ్ఞ మోక్షంబు దే
మ్మని నే బేరము పెట్టలేను భవ ♦ దీయంబైన ధ్యానంబు నా
పనిగా జేసెద నూపిరింబలె స్వభా ♦ వం బొప్ప నల్లాప్రభూ! 2

మ. జలరాశిన్ విలసిల్లు వీచికలతో ♦ సఖ్యంబు గావించి పు
వ్వులతో నెయ్యము సల్పి తత్సుధలతో ♦ బొత్తై నభోవీథి జు
క్కలతో వియ్యములంది నీ ఘనఘనా ♦ కారంబు జింతింతు ని
ర్మల సౌభాగ్యసుధా ప్రవృష్టి గురియన్ ♦ రావయ్య అల్లాప్రభూ! 3

మ. జల మధ్యంబున లేచు బుద్బుదము లో ♦ జన్ బెద్దలై కొన్ని కొ
న్నిలవాకారములై తనర్చు పగిదిన్ ♦ నీ యందు రూపించు మ
ర్త్యులు నీచాధిక తారతమ్య భవసం ♦ దోహంబులన్ భ్రాంతులై
కలహింపన్ జనుచుందు రీ వని యెఱుం ♦ గన్ లేక అల్లాప్రభూ! 4

మ. కలుముల్ లేములు వచ్చి పోవునవి మే ♦ ఘవ్రాతముల్ మింటిపై
కలయం బ్రాకుచు నేగునట్లు సుఖదుః ♦ ఖ ప్రాప్త మప్రాప్తముల్
కలలంబోలెఁ దనర్చు గోరికలు వృ ♦ క్షచ్ఛాయలన్ బోలె మ
ర్త్యుల వెన్నాడు మహేంద్రజాలము జగం ♦ బూహింప నల్లాప్రభూ! 5

మ. కలఁడో లేఁడొ పరాత్పరుం డనెడు శం ♦ కన్ గొంద ఱధ్యాత్మవా
దులు తామే పరమాత్ము లంచు నదు ♦ ద్యోగంబునన్ గొంద రా
శల దేయంబగ లౌక్యరీతి మతి ని ♦ ష్ఠన్ గొల్చుచున్ గొందఱా
వలనిన్ గాంతురొ లేదొ నీదు నిజరూ ♦ పం బర్థి నల్లాప్రభూ! 6

శా. పాపం బెన్నఁడు సేయుతే దెఱుఁగ కే ♦ పాపంబు గావించినన్
నాపైఁ గోపము జూపబోక కరుణన్ ♦ రక్షింపవే కావవే
యాపద్బాంధవ దేవదేవ సదయా ♦ యవ్యాజ తేజోమయా
నీపై భారము మోపినాఁడ గృప బో ♦ నీకయ్య, అల్లాప్రభూ! 7

మ. ధనహీనుండయి పుత్రదార గృహయు ♦ క్తంబైన సంసార దుః
ఖ నిధిన్ మున్గుచు తేలుచున్ నిను మదిన్ ♦ గానంత నూహింప లే
క నయంబున్ మృగతృష్ణకై జనెడు దా ♦ హార్తున్ బోలె బో
వును మోహావిలచిత్తుఁడై చపలుఁడై ♦ మూర్ఖుండు నల్లాప్రభూ! 8

మ. ధనముల్ ప్రాప్తములోన లేనియెడ సం ♦ తాపంబునన్ గుందినన్
ధనికున్ జేరి విధేయుఁడైనను బ్రియ ♦ త్నప్రక్రియా కౌశలం
బున నెన్నేని యొనర్చినన్ దుదకు రా ♦ బోదొక్క పీసంబు నీన్
ననయంబున్ మదిగొల్చు వారికగు స ♦ ర్వార్థంబు లల్లాప్రభూ! 9

మ. నిను తేజోలసితాంతరాత్మ వనుచున్ ♦ వీక్షింతునో లేక లో
క నికాయ ప్రణుతాఖిల ప్రజను గా ♦ గాంక్షింతునో పుణ్య స
జ్జన దృగ్గోచరతత్త్వమూర్తి వని నే ♦ సాధింతునో భక్తి నే
మని పూజింతుఁ బరాపరాత్మవు మహా ♦ త్మా, దేవ, అల్లాప్రభూ!

మ. నినుఁ జింతింపఁగ లేక పెక్కు సదసత్ ♦ నీ నా వివాదంబులన్
జను లంధఃపతితాత్ములై చెడుదు రా ♦ శా పాశముల్ జిక్కి దే
నిని వర్జించిన నీ వెఱుంగబడుదో ♦ నిత్యంబు నాయాస బా
సిన నీ తేజము చూడవచ్చు నెమటన్ ♦ సిద్ధంబు నల్లాప్రభూ! 11

మ. కడియన్నంబున కాసజేసి ధనికా ♦ గారంబులన్ జేరి క
ట్టడి నిట్టూర్పుల బుచ్చి యాచకులు క ♦ ట్టా వేడినన్ వాగ లె
క్కడి భూతంబిది యంచు రోయుదురు జ ♦ క్కన్ నిన్ను నర్థించి తే
యిడవా యన్నము లోకరక్షకుడ వీ ♦ వేగావ అల్లాప్రభూ! 12

శా. రాజుల్ ధూర్తులు దుష్టచిత్తులు మృషా ♦ ప్రాగల్భ్యమూర్తుల్ వృథా
వ్యాజస్తోత్ర పరాయణుల్ కుమతులా ♦ పాపాత్ములన్ జేర నే
యోజన్ జెల్లదు కోవిదప్రతతి యు ♦ ద్యోగించి నీ కర్థులై
యోజింపన్ నిఖిలార్థముల్ బడయ లే ♦ రో రాదో అల్లాప్రభూ!

మ. శునకాకారులు దూషకుల్ విటనటుల్ ♦ శుద్ధాంత కాంతాళిపై
కనువేయన్ వెనుదీయనట్టి కుకవుల్ ♦ కాసంత సందున్న స
జ్జనులన్ మాడిచి పొట్ట నింపుకొను ల ♦ జ్జా హీనులన్ రాజు లో
జను బూజింతురు వారి కేర్పవల దీ ♦ జన్మాన నల్లాప్రభూ! 14

మ. ఘనకర్పూర పరాగరాశులను వే ♦ ట్కన్ దెచ్చి వారాశి బో
సిన రీతిన్ నవరత్న భాండమున గా ♦ సిన్ జొన్న గుగ్గిళ్లు వం
డిన లీలన్ జనులెల్ల ప్రేమనొక దం ♦ డీ పాటిగాఁ జేసి భూ
వనితార్థంబుల వెచ్చ పెట్టెదరు నీ ♦ పై బెట్ట కల్లాప్రభూ! 15

మ. తపనోష్టంబున నీళ్ళు కాగి యవి సం ♦ ధ్యన్ జల్లనైనట్టు లా
తపముల్ జేసి గడించు మోక్షమునని ♦ త్యం బౌట తథ్యంబు నీ
కృపచే గల్గిన మోక్షమే నిరుకు భ ♦ క్తిన్ నిన్ను సాధించి నీ
యపవర్గంబును బొందువారి కగు ని ♦ త్యానంద మల్లాప్రభూ! 16

మ. సిరి పుణ్యంబున రాదు పాపమునకే ♦ సిద్ధించు డబ్బున్న వా
రరయన్ బంధులచే సతీసుతులచే ♦ నజ్ఞానిచే జ్ఞానిచే
కరమున్ నిందలపాలు జెందుచును దుః ♦ ఖప్రాయులై యుందు రీ
కొఱ తేలా భవదర్థసేవసుధ మా ♦ కున్ గూర్చు మల్లాప్రభూ! 17

మ. మృగముల్ పక్షులు కీటకంబులు దినం ♦ బెచ్చోటనో క్షుత్తు పో
వ గడింపన్ నియమించి తీ విడవు ద్ర ♦ వ్యం బేరికిన్ దాఁచ నీ
విగ మర్త్యాళికె యేలపెట్టితివి జీ ♦ వభ్రాంతి గర్వించి నీ
సుగుణారాధన సేయ నోపదుగదా ♦ సర్వేశ అల్లాప్రభూ! 18

మ. ఎలుకల్ చీమలు తేనెటీగ అట నా ♦ ర్జించున్ ధనంబట్టి వా
రలకున్ గౌరవమేల నిత్తురో, తృణ ♦ ప్రాయముల్ గదా భాగ్యవం
తులు వారిన్ గొనియాడుచున్ బ్రతుకు నం ♦ ధుల్ నిన్ను వీక్షింప లే
రలఘు ప్రాభవు నిన్ను వేడనిడ వే ♦ శ్వైశ్వర్య మల్లాప్రభూ! 19

శా. నీవే విశ్వమయుండవైన దివిపై ♦ నీ రేజజాండంబుపై
ఆ వైకుంఠముపై వసింతు వన మి ♦ థ్యావాదమే గాద కొం
కే వృక్షాకృతినైన వేళ్ళ నది పి ♦ క్షింపంగ రానేర న
ట్లీ వెందున్ గనరావు సర్వము భవత్ ♦ దృశ్యంబు అల్లాప్రభూ! 20

# శ్రీ మహమ్మద్ రసూల్. ౧

అతఁడె శ్రీ మహమ్మదు ముస్త ♦ ఫా - రసూలు
అతఁడె మానవోద్ధారకుఁ ♦ డతఁడె ప్రభువు
అతఁడె మార్గదర్శకుఁడు మ ♦ హా ప్రవక్త.
ఎవనికై లోకములు సృజి ♦ యింపఁ బడెనో
యెవనికై జీవజాలమ ♦ ర్థించునో క్కొ-
యెవనిలో విశ్వ ముకపూస ♦ యేని కాదో
యెవనిలో గతాగతకాల ♦ మెఱుకఁ బడెనో అతఁడె॥

అదియె యోంకారుఁ డక్షరుఁ ♦ డవ్యయుండు
భవ్య దివ్యావతార ప్ర ♦ భా ప్రపూర్ణుఁ
డఖిల కల్యాణగుణమూర్తి ♦ యనుపమాన
శమదయా స్ఫూర్తి లోకైక ♦ చక్రవర్తి అతఁడె॥

ప్రకృతిమేఘాల గర్జించి ♦ వార్ధివీచి
కల శిరంబును వంచి వె ♦ న్నెల బయళ్ళ
తేట తెల్లంబుగా వేని ♦ దెలిసికొనెనొ
చేరఁజాలని పాతాళ ♦ సీమలందు
వెడలఁజాలని నక్షత్ర ♦ వీధులందు
తేట తెల్లంబుగా వేని ♦ తెలిసికొనెనొ అతఁడె॥

కుసుమసౌరభములఁ దోఁగి, ♦ కువలయముల
దాఁగి, రోదసీకుహూరాల ♦ కేఁగి యేఁగి
అణువు మొదలు మహానుహా ♦ దంతరముల
నిండి దీపించు నెవని బ్ర ♦ హ్మాండ కాంతి అతఁడె॥

అరబుసైకతసీమల ♦ కరకురాల
బోలు కరుణావిహీనులఁ ♦ బొడమె నే ప్ర
భాకరుఁడు, దోషదూషిత ♦ భావకలిత
తమసు నశియింపఁజేసి వి ♦ స్తారకాంతి
జీవములఁ బోసె భక్త రా ♦ జీవములకు సతఁడె॥

దారుణదురంతదుఃఖ వ ♦ ధావిధాన
సంక్షుభితరక్తసిక్త వి ♦ శ్వంభరాల
ప్రేమరసనుధాసిర్ఘరీ ♦ స్తోమ మచట
వెల్లువలుగాఁ బొంగించి ♦ విమలభాత్ర్య
భావకేదారములు తృప్తిఁ ♦ బండి పౌరల
సిరుల కాణాచిజేసి ర ♦ క్షించె నెవరు
నిత్యకల్యాణ దాయియై ♦ నిలిచె నెవరు అతఁడె॥

చదువులోపల తత్వంబు ♦ చదివె నెవరు
సత్యకాంతాలలో తేటు ♦ చాటె నెవరు
విమలశీలంబు ప్రజకు నే ♦ ర్పించె నెవరు
విగ్రహారాధనలు విడి ♦ పించె నెవరు అతఁడె॥

ఆసవము వ్యభిచారంబు ♦ నణఁచె నెవరు
మహి దురాచారములు బరి ♦ మార్చె నెవరు
బానిసతనంబు మొదలంట ♦ బాపె నెవరు
సతులకెల్ల స్వాతంత్ర్య మొ ♦ సంగె నెవరు
ఈశ్వరుని యేకతను ప్రబో ♦ ధించె నెవరు
అతఁడె శ్రీ మహమ్మదు ముస్త ♦ ఫా రసూలు
అతఁడె మానవోద్ధారకుఁ ♦ డతఁడె ప్రభువు
అతఁడె మార్గదర్శకుఁడు ను ♦ హాప్రవక్త.

# ముసద్దసె హాలీ

క. చాలునిరాశా! నీ కర
వాలంబున మా మనోజ్ఞ ♦ వాంఛాలతికా
జాలంబుఁ ద్రుంపఁబోకు మ
దాలసవృత్తులు సదా ము ♦ దంబిడవు సుమీ. 1

శా. ఓ వాంఛాలలనా! భవన్మహిమచే ♦ నుద్యత్ప్రభాకీర్తి మా
కీ వీయంగదె మా మనోరథ చయం ♦ బిష్టార్థముం గూర్చి సా
భావంబందు నిరాశఁ బోఁదుడిచి సౌ ♦ భాగ్యంబులన్ బొందు వి
ద్యావిఖ్యాత వివేక తేజముల ని ♦ య్యంగావలె న్నిచ్చలున్. 2

ఉ. తెరవుల గాసిఁజెంది కడు ♦ దీనత హైన్యముచేతఁ జిక్కి దు
ష్కరవిపదబ్ధులన్ బడి ♦ విషాదముఁ జెంది పథశ్రమంబునన్
బిరబిరఁబోవు పాంథుఁడును ♦ భీతిని జెందక వాంఛ నిన్ను సం
స్మరణముఁ జేసి ధైర్యమున ♦ సంమదవృత్తిఁ జరించు నిమ్మహిన్. 3

చ. పొలమును దున్నువాఁడయిన ♦ బ్రొద్దును గాలముఁ గాలరీతులన్
జలముల వర్షధారలను ♦ జారు నదీనదనిర్ఝరావళిన్
దలఁపక నిన్ను నమ్ముకొని ♦ దైవముపై బరువుంచి కర్షవృ
త్తుల నొనరించు, లేనియెడ ♦ దుర్ఘట మన్నము; ధాన్యమబ్బునే.

ఉ. జోగుల భోగవంతులను ♦ శుద్ధదరిద్రుల భాగ్యవంతులన్
సాగరగాములన్ ధరణి ♦ జాములఁ జేసి సికందరప్రభున్
బాగుగ రాజరాజుగ నొ ♦ నర్చి కొలంబసుపుణ్యమూర్తి కెం
తేగతియై వినూత్న జగ ♦ మిచ్చుట నీ మహిమంబుఁ గాదొకో. 5

---

* హాలీకవి ఉర్దూభాషలో వ్రాసిన కావ్యమున కనువాద సంగ్రహము.

చ. వాడితిమి మేము నూహింతుల ♦ చేష్టలు విభ్రమపున్న చీకటిన్
గడుకొనియుండె, నా కొలఁది ♦ గాక నమూనావనాటి సంఘమం
దిడుముల రక్తపాతముల ♦ నెన్నిటిఁజేయఁగ నోచియున్నదో
కడువడి నీ మహామహిమ ♦ గాంచి నటింపఁగఁ గంటిమింతకున్. 6

ఉ. ప్రస్తుతసంఘ మెంతయును ♦ ప్రాణవిహీన మహీజమై సదా
నిస్తుల సత్ప్రభాపటల ♦ నిర్మలకీర్తి వివర్ణమై యినుం
డస్తమయంబు నొందుగతి ♦ నంధతమోవృతమౌచునున్నఁ బ్రా
శస్త మతాభిమాన భవ ♦ శస్త్రవివాదము మాన దింతకున్. 7

సీ. ధనమార్జనముఁ జేసి ♦ తగుల మొందుటకంటె
డంబుమీఱెడు గౌర ♦ వంబు మేలు
పరుహాకింతయులేని ♦ బ్రతుకు గాంచుటకంటె
సన్యాసి యైపోవఁ ♦ జాలమేలు
మోహపాశంబుల ♦ మునిఁగి వీఁగుటకంటెఁ
బ్రాప్తులాభార్థ సం ♦ తృప్తి మేలు
ఒరుల మేఁటను దన ♦ శిరముపై నిడుకంటె
మరణించి దివిపైకి ♦ నరుగ మేలు
ఇట్టివారలు భువిలోన ♦ నెట్టులున్న
నొక్కచోట విధేయులై ♦ యుండఁబోరు
వారు పడియున్నవారల ♦ భావరవి క
రాళిపైనుండు, మృతజీవు ♦ లగుటఁ దన. 8

సీ. మతసంఘమునఁ గొంద ♦ అతి విషాదాత్ములు
కొందఱు సంతోష ♦ కోపిదులును
దౌర్జన్యమునఁ బాప ♦ మార్జింత్రు కొందఱు
సాధులై కొందఱు ♦ సాగుచుండ్రు

చం. గడచినదానికిన్ వగవ ♦ గాఁ బనిలేదని తృప్తచిత్తులై
చెడుగునడంచి సంఘమున ♦ సిద్ధవచో విహితానులాపులై
వడివడి వృద్ధిచేకుఱఁగ ♦ వచ్చెదురీతు లుపన్యసించి యే
గెడువర కేగి పూర్వ నిజ ♦ కీర్తిగడింపఁగఁ జూడఁగావలెన్. 20

సీ. జనులార ఘనులార ♦ మన కెట్టికష్టంబు
లలవడెనో చూడ ♦ వలయు మీరు
మన వెంటవచ్చిన ♦ మన తోడివారు స
వారులైఁజనిరి యె ♦ వ్వారు లేరు
సార్థవాహులు నిజ ♦ స్థానంబు జేరిరి
మనము త్రోవ మొదటఁ ♦ గునికినాము
ఇప్పుడేగఁజూచిన ♦ నెన్నాళ్ళకో నిర్గ
మస్థానమును జేర ♦ మనకుఁ గలదు
కాని గూర్చుండుకంటెను ♦ గడవ మేలు
ధైర్యమతులకుఁ దోడ్పడు ♦ దైవమెప్పుడు
నీడఁబోయిన నెండకు ♦ నోడరాదు
కలదు కాలంబు నభివృద్ధి ♦ గాంచుకొఱకు. 21

ఉ. మొక్కను వేయువాఁడె ఫల ♦ ముల్ భుజియించెడు రీతి కార్యముల్
గ్రక్కున సేయువాఁడె తన ♦ కోర నభీష్టఫలంబులందు గే
కొక్కెడ మందభావమునఁ ♦ గూరుచునున్నఁ జెడున్ శశంబు పెం
పెక్కిన కూర్మరాజునకు ♦ జేలతనంబున నోడు కైవడిన్. 22

కం. శ్రమయే ఫలదాయకమగు
శ్రమయే భగవద్దయా ప్ర ♦ సారంబొసఁగున్
శ్రమగౌరవ మిడు గౌరవ
మమరఁ గులంబునకు మనకు ♦ నతిశయ మదియే. 23

తే. పాటుపడకున్న మన పూర్వ ♦ ప్రజలు నేడు
కలిత విద్యాప్రసూన సు ♦ గంధగరిమ
వెలువడదు శేముషీకళల ♦ విలువ లరయ
నింతయేటికి భగవంతుఁ ♦ డెఱుఁగలేఁడు. 24

తే. ఐహికాముష్మికంబుల ♦ కరయగా బ్ర
యత్నమే ముఖ్యకారణ ♦ మగునుగాన
నిహము పీడినఁ బరమైన ♦ నెఱుగుకొఱకు
యత్నములు సేయఁదగు మర్త్యుఁ ♦ డైనవాఁడు. 25

చం. నిముషము కష్టమున్ బడరు ♦ నిర్భయులై భయముండుచోటికిన్
బ్రమదముతోడఁ బోఁజనరు ♦ వచ్చిన దుర్యశమార్పివేయనే
శ్రమపడలేరు లజ్జను శి ♦ రంబునఁ దాల్చి చరిత్రుగాని సా
జములగు మంచిమార్గముల ♦ చర్చలొకింతయుఁ జేయలేరొగిన్. 26

ఉ. పూర్వులు దేశభక్తులును ♦ బుణ్య యశోవిభవాభిలాషులై
సర్వము జేసిపెట్ట మన ♦ సంఘమునందు విలాసదీధితుల్
పర్వఁ బ్రపంచవన్యమున ♦ బంధురకీర్తి సుమాళి పూయఁగా
నిర్వహణంబొనర్ప మన ♦ నేర్పులు చాలమిరాలఁజూచెడిన్. 27

కం. ఇంతయు సుఖమును మది వి
శ్రాంతియుఁ గోర కనుదినము ♦ శ్రమపడి సంఘం
బెంతయు వృద్ధికిఁ దెచ్చి ది
గంత మహాకీర్తి గాంచి ♦ గడచిరి యార్యుల్. 28

సీ. సరిలేని సంఘ సం ♦ స్కార పద్ధతులందు
సాహసౌదార్యంబు ♦ సలిపి సలిపి
మతసదాచార ప ♦ ద్ధతులందుఁ దన మనః
ప్రాణముల్ వెచ్చింప ♦ వలసి వలసి

హితవచఃప్రకట సం ♦ గతులందుఁ దమ మేను
ప్రజలకై యర్పించి ♦ ప్రబలి ప్రబలి
దేశోపకార సం ♦ దేశంబు లలరించు
బుద్ధులు జనులకుఁ ♦ బోసిపోసి
తాము చచ్చినఁ బ్రజలను ♦ నోముకొఱకుఁ
బాటుపడినారు రేబవల్ ♦ పరమదయను
ఇట్లు జీవింప వారి స ♦ మిద్ధవరము
ఇట్లు మరణింప వారి ♦ సమిద్ధదివము. 29

చం. ఎవరు విపత్తులన్ శ్రమ వ ♦ హింతురొ, వారికి శ్రేయంబుఁ గాంచు రీ
యువనిని కష్టముల్ పడక ♦ యాత్మహితంబుగఁ గొందఱు సు
భవము ధరాధిపత్యము ప్ర ♦ పంచసుఖంబులు గావు; [illegible]
నవనవలాడి చిన్నవయి ♦ సన్నగద పెద్దవియై ఫలించెమున్. 30

మ. ధర నేస్థానమునందుఁ గీర్తి గలదో ♦ దైన్యంబు బోనాడి సు
స్థిర సంఘం బభివృద్ధిచేయఁగల యా ♦ ధిక్యంబు లెందున్నవో
భరమై క్షీణతఁగాంచు సంఘమును లే ♦ వంజేయు దోశ్శక్తి యే
పరశక్తిం గలదో వృథావిడిచి సం ♦ భావించుచున్నా మొగిన్. 31

తే. చదువు చాలదు జనులార ♦ ముదముగనుట
కింక రోదసీ కుహరమం ♦ దంకురించు
వివిధవిద్యా ప్రపంచంబు ♦ లవని నెఱుఁగు
కొఱకు యత్నింపవలె మేలు ♦ కొఱకు మనకు. 32

సీ. మనయందు యోజింప ♦ మహిత సౌలభ్యకా
కొన్ని విశేషంబు ♦ లున్నవింక
మన మెఱుంగము గాని ♦ మరణించు లోపలఁ
గాంచకుండిన మట్టిఁ ♦ గలియు నవియు

నీ మహాకారుణ్య ♦ మీశ్వరేచ్ఛాప్రదత్త
మై ప్రకాశించుఁ ♦ బ్రత్యక్షలీల
భ్రాంత చిత్తంబుఁ ♦ బ్రాల్మాలి దానిని
బోఁగొట్టవలవదు ♦ పోగలవలదు

ఎచట మాంద్యంబు సజ్ఞాన ♦ మెచటఁ గలదొ
యెవరు దౌర్జన్యమున భాగ ♦ మొందనివారొ
యట్టి హీనులు మనయందుఁ ♦ బుట్టిరిప్పుడు
గాన వారింపవాక్కడ్డ ♦ మూనవలయు. 33

తే. ఎవరు విద్యాధికారసం ♦ దిద్ధశక్తి
పూని యాచంద్రతారక ♦ మైనకీర్తి
తో విజయలక్ష్మితోఁ దులఁ ♦ దూఁగినారొ
వారి పుత్త్రకు లిపుడు ఫ ♦ కీరులైరి. 34

తే. జగతి విపరీత కార్యముల్ ♦ జరిపి మఱియు
భువిని దివిఁ జేసి దివిని నీ ♦ భువిని జేయఁ
జాలిన మహానుభావుల ♦ సహజ రక్త
ధార నేటికి మనయందుఁ ♦ బారుచుండె. 35

మ. అధికారంబది యస్తమించెఁ గల భా ♦ గ్యంబెల్ల సున్నాయె నీ
పృథివీ రాజ్యము పూజ్యమాయె నిక సం ♦ ప్రీతిన్ మదోద్రిక్త దో
ర్విధి వర్ధానముల్ నశించె మఱియున్ ♦ విద్యాప్రగల్భత్వ మా
బుధసంఘంబు లోకంబు నిబ్బరకునై ♦ బోస్సై ప్రదీపించెసిన్. 36

మ. యవనారబ్ధిక కాజిరోమక నులా ♦ ద్యావర్తదేశంబు లీ
యవనీ భాగమునన్ వివేకజను లత్యం ♦ తంబు విద్యావధూ
నవలావణ్యకలాకలాపములఁ స ♦ న్మానించుటన్ గాదె యా
జనసత్త్వంబులు శేముషీకలితమై ♦ చర్చింపఁగానయ్యెడిన్. 37

శా. ఈ విద్యారమణీయరత్నము సదా ♦ యింపారుసొంపారు సం
భావింపంబడుఁగాని మూల్యమును దే ♦ ల్పం దాని దర్శింపగా
నేవారున్ మదిఁబూన రింతకు మను ♦ ష్యేచ్ఛామహాశక్తియై
యావిర్భావమునొందె దైవమువలెన్ ♦ నైకస్వరూపంబులన్. 38

చ. కులగిరులన్ బగిల్చి ఖగ ♦ కుంజరపంక్తిని బట్టియిచ్చి యీ
జలధి నిగిర్చి యంధతమ ♦ సంబును మాపి ధరిత్రిఁ ద్రిప్పి రి
క్కులగతులన్ వృథాగతుల ♦ గా నొనరించి ప్రపంచవాహినుల్
వలనునొనర్చు కార్యములు ♦ వారక యీవిరిచేతఁ జేసి బొ
మ్మల రచియించిమానవుల ♦ మాట్కినటింపఁగఁ జేసెదీవశా. 39

చ. చెకుముకి లింధనంబులుగఁ ♦ జేయుచు నావలఁ నేల్పైని పో
నడుపుచు మూసలందుం ని ♦ నాదములన్ రచియించిభూమిలోఁ
గడుకొనులోహముల్ వెలికిఁ ♦ గ్రక్కఁగఁ జేసితటిల్లతాళిచేఁ
గడుపుచు తంతివార్త త్రుటి ♦ కాలమునన్ గగనాంతరాళముల్
వడి జను పక్షినిర్దళిత ♦ వాహనముల్ రచియించె దెంతయున్. 40

సీ. నాగరికత్వంబు ♦ నాటి సింగారించి
వెలయించుచున్నదీ ♦ విద్యసుమ్ము
అభివృద్ధి యను సేన ♦ కధికారియై చాల
వెలయించుచున్నదీ ♦ విద్యసుమ్ము
కర్మకారుల కుప ♦ కరణంబు లందించి
వెలయించుచున్నదీ ♦ విద్యసుమ్ము
మోఘవీరులకు నా ♦ యుధమై ప్రపంచాన
వెలయించుచున్నదీ ♦ విద్యసుమ్ము
ధైర్యసాహసవంతుల ♦ ధరణి మాపి
వెలయఁజేయించుచున్నదీ ♦ విద్యసుమ్ము

సింహములనైనఁ గుందేళ్ళఁ ♦ జేసివిడిచి
వెలయఁజేయు నసామాన్యదీ ♦ విద్యసుమ్ము. 41

చ. యవనుల నాంధ్రరాజుల ల ♦ యంబొనరించెను రాక్షసాలి పె
ద్దనము నడంచి యుగ్రభయ ♦ సత్వమహామహానవీరసంక్తి నీ
భువి బలిపెట్టెఁ బౌరుషము ♦ బూడిదపాల్పొనరించె నందితో
ప్రవిమలసత్వ లోకనిత ♦ భావములన్ దెలుపుం గదా విద్యతాన్. 42

తే. కుంజరంబును దోమచేఁ ♦ గూల్పఁగల్గు
బండ్ల నోడల నోడలు ♦ బండ్ల జేయుఁ
గోటగోడలు గోటితో ♦ మీటఁజేయుఁ
గనచములనైన మచ్చులు ♦ గాఁగఁజేయు. 43

తే. విలసితంబగు విద్యావి ♦ వేకమొకటి
ధరణి సహకారిమార్గప్ర ♦ దర్శకంబు
నెపుడు చేతురొ యారు మా ♦ నవులకంటె
శ్రేష్ఠతములగువారు ను ♦ త్కృష్టులగుట. 44

ఆ. ధరణి దాగియున్న ♦ ధననిధుల్ తెరపించి
విజయలక్ష్మి నిచ్చి ♦ వెలయఁజేసి
గాలి యగ్ని జలము ♦ గాలంబు స్వాధీన
పఱచుఁజూవె విద్య ♦ పరమకృపను. 45

చ. ఇతులనైన ధైర్యము నొ ♦ సంగెయు వీడకు ప్రేమమైన నీ
పుడమి యశంబులో నుదర ♦ పోషణ సేతురు విద్యకున్న నో
వెడలెద రెంతపన్నయిన ♦ వేఁకరుపాటును లేక యిట్టులే
పొడముగ విన్నఁజూచినను ♦ బూన్పులజీవితముల్ నేలంగన్. 46

ఉ. అంచితమైనవిద్య గల ♦ దంచు వచించినమాత్రనే ప్రపం
చించి ప్రయాణమైజను వి ♦ చిత్రగుహాంతర మార్గగాములై
రెంచగనెల్లచోట్ల నిటు ♦ లేగెదు బాలురె గానవత్తు హూ
• హించ మహమ్మదీయ నృపు ♦ లేలెడుకాలమునందు వింశగాన్. 47

తే. ధర నజామియ్యనూరియ్య ♦ దనరిరొౌకట
నాసబియ్యానఫీసియ్య ♦ షాహెబియ్య
షా రెరియ్య యజీజియ్య ♦ వాసిగాంచె
నెరపేముస్తాన్సరీయ్యజీ ♦ నియ్యయనెడు
ఘనరవాహియ్య యిజ్జియ్య ♦ యనెడు సర్వ
విధకళాశాల లమరును ♦ విద్యకొఱకు
నట హిజాజీఒఖున్ద్ఖి ♦ ప్వాఖిను నెడు
సంఘములవార లానాడు ♦ చదువుచంద్రు. 48

ఉ. ధైర్యముపీడబోక యల ♦ దైవముపై భరముంచి నాత్మవుం
గార్య మొనర్చుచేయెరువు ♦ గా గొనుశక్తిని వీడి పుణ్య చా
తుర్యముతో మనోరథము ♦ దోలుచు నిట్టటు లూఁగనీక గాం
భీర్యముపూని సుస్థిర వి ♦ వేకముతోఁ జనఁగావలెన్ జుఁడీ. 49

తే. గడవఁదలచినఁ గష్టముల్ ♦ గడవఁగలరు
చేయఁగలిగిన కార్యముల్ ♦ చేయఁగలరు
ధైర్యకరములఁ బ్రాప్తంబు ♦ దాగియుండు
ధైర్యమతులకుఁ దోడ్పడు ♦ దైవమెపుడు. 50

తే. దాసులకు దాస్యవృత్తియు ♦ ధరణిపతుల
కరయ బరిపాలనా విధుల్ ♦ గలుపుచుండు
హృదయ వైరాక్షరంబుల ♦ నెల్లఁజెలుపుఁ
బిన్న పెద్దల నమదృష్టి ♦ నెన్నఁజేయు. 51

